విజయ సింధూరము
స్త్రీలహిస్టీరియా, కుసుమ
వ్యాధులను హరించును.
వెల ముఱు. 4-0-0
శ్రీకృష్ణ ఆయుర్వేద ఫార్మసీ
హెడ్డాఫీసు-ఏలూరు

# ఆంధ్రపత్రిక

లంగరు మార్కు

The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 34 No. 328 MONDAY 22nd MARCH 1948 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao

# ట్రియెస్టిని ఇటలీవశంచేయాలి

## సోవియట్ రష్యాకు అగ్రరాజ్యత్రయం ప్రతిపాదన

### వెనుకటి ఆఫ్రికావలసలు కూడా ఇటలీపరం గావాలని ఫ్రాన్సుసూచన

వాషింగ్టన్, మార్చి 20: ప్రస్తుతం స్వతంత్ర ప్రాంతంగా ఉన్న ట్రియస్టీ ఇటలీకి దత్తంకావాలని బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సులు సోవియటురష్యాకు ఇటలీకి సూచించెను. ఈ ప్రతిపాదనప్రతిని అగ్రరాజ్యత్రయం యుగస్లావియా ప్రభుత్వానికి కూడా పంపినట్లు తెలుస్తున్నది. ఈ నిర్ణయంవల్ల ట్రియస్టీలో అల్లరులు ప్రజ్వరిల్ల వచ్చునని ఊహించి ట్రియస్టీలోని బ్రిటిషు, అమెరికను అధికారులు సైనిక బందోబస్తు ఎక్కువగా చేశారు.

ట్రియస్టీ, లోగడ ఇటలీవలసలుగా ఉండిన ఆఫ్రికా భూభాగాలు తిరిగి ఇటలీకి సంక్రమించాలని తమప్రభుత్వం అభిప్రాయపడుతున్నట్లు ఫ్రాన్సు విదేశాంగమంత్రి జార్జి బిడాల్టు నేడు పారిస్‌లో "ఫ్రాన్సు ఇటలీ కస్టమ్సు యూనియను" ఒడంబడికపై సంతకాలు చేసే సందర్భంలో వెల్లడించారు.

ట్రియస్టీ విషయమై రష్యాకు చేసిన సూచనను వెల్లడిస్తూ అగ్రరాజ్యత్రయప్రభుత్వములు ఈరోజు ఒక సంయుక్తప్రకటన చేసెను. ట్రియస్టీగవర్నరు నియామకం విషయంలో ఇప్పటివరకూ ఏకాభిప్రాయం కుదరలేదనీ, అలాంటి అంగీకారం దుస్సాధ్యమని భద్రతామండలి చర్చల ధోరణి స్పష్టంచేస్తున్నదనీ ఈ ప్రకటన వివరించింది. లోగడ జరిగిన ఏర్పాటు ప్రకారం దక్షిణట్రియస్టీని యుగస్లావియా, ఉత్తరభాగాన్ని బ్రిటిష్, అమెరికను సైనికాధికారులు ప్రజాసత్తాకసూత్రాలననుసరించి, స్థానిక ప్రజాభిమతమును పాటించి తాత్కాలిక పాలనప్రభుత్వం వ్యవహరింపవలసివుండెను. కానియుగస్లావియా ఇందుకు భిన్నంగా దక్షిణట్రియస్టీని కేవలం యుగస్లావియా దేశంగానే పరిగణించి, ప్రజాభిమతమును నిర్లక్ష్యంచేసి పరిపాలన సాగిస్తూవుంది. ఈ పరిస్థితుల్లో ట్రియస్టీపరిపాలన ప్రజాసత్తాకపద్ధతులపై, ట్రియస్టీప్రజల కోరికప్రకారం జరగాలంటే అందుకు ఆప్రాంతాన్ని ఇటలీ ఆధిపత్యానికి మార్చడం ఒక్కటేమార్గం అని తాము భావించుచున్నట్లు అగ్రరాజ్యత్రయం ఈ ప్రకటనలో స్పష్టంచేసెను. త్వరలోనే ఈ సూచనను పురస్కరించుకొని వీరు భద్రతామండలిలో ఒక ప్రతిపాదన చేయనున్నట్లుకూడా తెలుస్తున్నది.

యుగస్లావియా విదేశకశాఖ సహాయమంత్రి అలెక్స్ బెబ్లెర్ అగ్రరాజ్యత్రయ ప్రకటనపై వ్యాఖ్యానింప నిరాకరించారు. ఈ సూచనప్రతి ఇప్పటికి తమ ప్రభుత్వానికి చేరలేదని అమెరికనుయునైటెడ్ ప్రెస్ విలేఖరిప్రశ్నకు ఈయన సమాధానం ఇచ్చారు.

## స్టాలిన్ దగ్గరకు రాయబార సంఘం

### పార్లమెంటులో కార్మికసభ్యుని ప్రతిపాదన

లండన్, మార్చి 20: ఒకరి వ్యవహారాలలో ఒకరు జోక్యం చేసుకోకూడదన్న సిద్ధాంతంమీద, రష్యా బ్రిటన్ల మధ్యను, తూర్పు పశ్చిమ యూరపుల మధ్యనూ తాత్కాలిక ఒడంబడిక ఒకటి సాధించడానికై, బ్రిటిష్ ప్రధానమంత్రి అట్లీ, దక్షిణ ఆఫ్రికా ప్రధాని స్మట్సు, ఇండియా గవర్నర్ జనరల్ లార్డ్ మౌంట్‌బాటెన్ లతో కూడిన ఒక రాయబార సంఘం స్టాలిన్‌ను కలుసుకోవాలని కార్మిక సభ్యుడు సైమూర్ కాక్స్ కామన్సుసభలో ఒక ప్రతిపాదన దాఖలుచేయబోతున్నాడు.

## ఆసాం ముస్లింలీగుపార్టీ

షిలాంగ్, మార్చి 20: ఆసామ్ ఎసెంబ్లి ముస్లింలీగుపార్టీ నేటినుండియు రద్దు గావింపబడెనని సదరుపార్టీ నాయకుడు మహమ్మద్ సాదుల్లాగారు నేడు రాష్ట్రీయ ఎసెంబ్లి సభలో ప్రకటించిరి. ఈ సభ్యులు ప్రతిపక్షవర్గముగా సందురని క్రొత్త పార్టీ పేరు, దాని నియమనిబంధనావళి, కార్యక్రమము త్వరలో ప్రకటింపబడునని సాదుల్లాగారు చెప్పిరి.

## జర్మనీ సమష్టి పాలకమండలి సభనుంచి రష్యన్ ప్రతినిధి నిర్గమనం

### మిత్రరాజ్య చతుష్టయాధికారపరిణామం

బర్లిను, మార్చి 20: జర్మనీలో వేర్వేరు భాగాలను ఆక్రమించిన అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సు రష్యాల సమష్టి అధికారమండలి యొక్క టికలహం. ఈ సమష్టి అధికారమండలి సమావేశము నేటి రాత్రి బర్లినులో జరిగినది.

ఈసభకు వచ్చిన రష్యను ప్రతినిధివర్గ నాయకుడగు మార్షల్ సోకొలోవ్‌స్కీ సభలోనుంచి వెడలిపోయెను. సభనుండి వెడలిపోవుటకుముందుగా తాను వ్రాసుకొని వచ్చిన ఉపన్యాసమును చదివెను. ఆ ఉపన్యాసములో ఇట్లు చెప్పెను.

అయినోపాఖండ పశ్చిమ రాజ్యాలన్నియు ఒక్కమాటంగా ఏర్పడి ఐక్యభావమును వెల్లడించుచున్నవి. కనుక జర్మనీ పరిపాలనకొరకై ఏర్పడిన 4 రాజ్యాలసమష్టి అధికారమండలి ఇక అంతరించినట్లే ఎంచవలెను.

ఈరీతిగా అధిక్షేపించి రష్యను ప్రతినిధి నిష్క్రమించిన పిమ్మట జర్మనీలోని అమెరికా తరపు గవర్నరు జనరల్ లూసియస్ డి. క్లేగారు సభాధ్యక్షత వహించి రి. అమెరికా, ఇంగ్లాండు, ఫ్రాన్సు తాలూకు ప్రతినిధులు మాత్రమే సభలో వుండి సభజరిపిరి.

తిరిగి సభ ఎప్పుడు సమావేశము కావలెనో నేడు నిర్ణయము చేయలేదు. తిరిగి యీసమష్టి మిత్రాధికారమండలి సమావేశం జరుగదనుటకు వీలులేదని బ్రిటిష్ ప్రతినిధి యొకడు చెప్పెను.

యుద్ధం పూర్తిఅయినప్పటి నుండియు జర్మనీలో యీనాలుగు రాజ్యాలవారు సమష్టిగా సంక్రమించుకొనుచు జర్మనీపై అధికారము వహించియుండిరి. కాని, యిప్పుడు రష్యను ప్రతినిధియగు సోకొలోవ్‌స్కీ యీ సభలోనుండి నిష్క్రమించుటవల్ల యీ సమష్టి అధికారమండలి అంతరించినట్లుగా ఎంచవలెనా అని బర్లిను నగరము లోని వారు సమాలోచించుచున్నారు. సోకొలోవ్‌స్కీ తన ఉపన్యాసమును వ్రాసికొని వచ్చి చదువుటవల్ల ఈ ఉపన్యాసాంశము లన్నియు రష్యాప్రభుత్వమునకు ముందుగా తెలిసి యుండవలెను. రష్యాప్రభుత్వము ఆమోదించి యుండవలెను. ఈ ఉపన్యాసమును ఆపశ్చిమ రాజ్య చతుష్టయసభలో సమావేశకరచవల సినదిగా పట్టుదల వహించి సోవియట్ రష్యా ప్రతినిధి వెడలి పోయెను. ఈ సభ జరిపిన సందర్భములో నుండి రష్యా ప్రతినిధి నిష్క్రమించవలెనని ముందుగానే రష్యా నిర్ణయించుకొనినట్లు తెలియుచున్నది.

## ఏప్రిల్ 9 న బర్మా మాజీ ప్రధాని యుసా ఉరి

రంగూన్, మార్చి 20: యుఆంగ్‌సాన్ మున్నగు బర్మామంత్రుల హత్యలో పాల్గొన్నందుకు మరణదండన విధింపబడిన యూసా, బర్మా మాజీప్రధాని, ఏప్రిల్ 9 తేదీన ఉరితీయబడునని అధికారికముగా నేడు తెలియవచ్చెను. యూసా కేసును ప్రివీకౌన్సిలుకు తీసికొనివెళ్లి ప్రయత్నము లు గావింపబడుచున్నవనుమాటలను పురస్కరించుకొని ప్రభుత్వమువారొక ప్రకటన గావించుచు బ్రిటిషు పార్లమెంటు ఆమోదించిన బర్మా స్వాతంత్ర్య చట్టము ననుసరించి బర్మా కోర్టులపై ప్రివీకౌన్సిలుకు అపీలు అధికారములేదని, ప్రివీకౌన్సిలు అధికారము బర్మా సుప్రీముకోర్టుకు సంక్రమించినదని చెప్పుచున్నారు. కేసును పునర్విచారింపవలెనని యూసా పెట్టిన దరఖాస్తును రంగూన్ హైకోర్టు కొట్టివేసెను. బర్మా సుప్రీముకోర్టుకు అపీలు చేయుటకు అనుమతికై యూసా న్యాయవాది ప్రయత్నించుచున్నాడని తరువాత తెలియవచ్చెను. (ఆ. ప్రె.)

## పాలస్తీనా సమస్య

### అమెరికా వైఖరిపట్ల అరబ్ సంతృప్తి

వాషింగ్టన్, మార్చి 20: పాలస్తీనా విభజన విషయంలో ఐక్యరాజ్యసమితి తీర్మానాన్ని తిరస్కరించి అమెరికా మరొక క్రొత్త ప్రతిపాదన చేయడంవల్ల అంతర్జాతీయ రాజకీయాల్లో ఒక నూత్న పరిణామం ఏర్పడింది. అమెరికా అధ్యక్ష ఎన్నికల్లో కూడా ఇందువల్ల ట్రూమన్‌కు ప్రాతికూల్యం హెచ్చగలదు.

అమెరికా తిరోగమనంవల్ల ఐక్యరాజ్యసమితి ప్రతిష్ఠ మంటకలిసిపోయిందనీ, అగ్రరాజ్యాలే ఈ విధంగా వ్యవహరిస్తుంటే ఇంక చిన్నదేశాలకు సమితిలో విశ్వాసం ఏమి ఉంటుందనీ రాజ్యాంగతంత్రజ్ఞులు ప్రశ్నిస్తున్నారు.

అరబ్ ఉన్నతాధికారవర్గం మాత్రం అమెరికా క్రొత్తవైఖరిని హర్షించింది. పాలస్తీనాలో స్వతంత్ర యూదు రిపబ్లిక్‌ను స్థాపించడం గురించి యూదు ఏజన్సీ ఆలోచించుచున్నట్లు తెలుస్తున్నది. పాలస్తీనాలో స్వతంత్ర అరబ్ ప్రభుత్వం ఏర్పడాలని, పాలస్తీనా అరబ్ రాజ్యంగా గుర్తింపబడాలని అరబ్‌లీగ కార్యదర్శి, సిరియా ప్రధాని, మొదలయిన అరబ్ నాయకులు హెచ్చరికలు చేస్తున్నారు.

# సోషలిస్టులుకాంగ్రెసునుండివైదొలగుటకు తుదిగడువు ఏప్రిల్ 15

## నాసిక్ మహాసభలో పార్టీనిర్ణయం

### కాంగ్రెస్ అభ్యర్థులుగా శాసనసభలకు పురపాలకసంఘాలకు ఎన్నికయినవారు కూడా రాజీనామానివ్వాలని ఆదేశం

నాసిక్, మార్చి 20; ఏప్రిల్ 15 వ తేదీలోగా, సోషలిస్టులు, కాంగ్రెస్‌లోని తమ ప్రాథమిక సభ్యత్వాలను, రాష్ట్ర కాంగ్రెస్, అఖిలభారత కాంగ్రెసు సంఘాలలోని స్థానాలను, కార్యనిర్వాహక వర్గాలలోని సభ్యత్వాలను రాజీనామానిచ్చి వైదొలగాలని, నాసిక్‌లో జరిగిన అఖిలభారత సోషలిస్టుపార్టీ షష్ఠ వార్షిక మహాసభలో నిర్ణయించబడింది.

కాంగ్రెస్ టిక్కెట్టుపై, స్థానికసంస్థలకు, పురపాలకసంఘాలకు శాసన సభలకు, ఎన్నికయైన సోషలిస్టులుగూడా తమతమ సభ్యతలకు రాజీనామాలనిచ్చి వైదొలగాలని, పార్టీ ఆదేశించినది. అయితే కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలునియమించిన, ఉపసంఘాలలోనూ బోర్డులలోను సభ్యులుగా ఉన్న సోషలిస్టులు, గాంధీజాతీయస్మారకనిధిసంఘాలలో సభ్యులుగాఉన్నవారు రాజీనామా నివ్వవలసిన అవసరంలేదని జయప్రకాశ్‌నారాయణ్ వెల్లడించాడు.

గాంధీ జాతీయ స్మారకనిధి సేకరణ విషయంలో, కాంగ్రెస్‌వారికి సోషలిస్టులు యితోధికంగా సహాయపడవలెనని జయప్రకాశ్ సూచించాడు.

కాంగ్రెసుతో సోషలిస్టులు తమ సంబంధాలను తెగతెంపులు చేసుకోవాలని ఆదేశిస్తూ ప్రతిపాదింపబడిన తీర్మానమూ, ప్రతినిధుల సమావేశం (విషయ నిర్ణయసభవంటిది)లోనూ బహిరంగ సమావేశంలోనూ యేవిధమైన చర్చలేకుండానే ఆమోదింపబడింది.

"దేశానికి స్వాతంత్ర్యం లభించడంతో, అంతవరకూ, భారత ప్రజాబాహుళ్యానికంతకూ ఏకైక సంస్థగా కాంగ్రెస్ నిర్వహించిన భూమిక సమాప్తమైంది. ఈ మహోద్యమ, కట్టుదిట్టమైన పార్టీగా తయారుచేయడానికి కాంగ్రెసు నాయకులే నిశ్చయించుకొన్నారు. కాంగ్రెస్ నూత్న నిబంధనావళి ననుసరించి, అందులో ప్రత్యేక కార్యక్రమము, ఆశయాలు, విధానముగల యేపార్టీగాని, వర్గముగాని ఉండడానికి వీలులేదు. ఇలా యితర పార్టీలకూ వర్గాలకు కాంగ్రెస్‌లో స్థానంలేకుండా చేయడం, అవహేళన చరిత్రలో యిదే ప్రథమప్రయత్నం. కట్టుదిట్టమైన పార్టీగా తయారవడానికి కాంగ్రెస్ నిర్ణయించుకోవడంతో, భారత ప్రజాబాహుళ్యంలో వివిధ వర్గాలకు ప్రాతినిధ్యం వహించే స్వరూపం కాంగ్రెస్‌కు లేకుండాపోయింది. అన్ని వర్గాలకు ప్రాతినిధ్యం వహించాలని కాంగ్రెస్ చేసే ప్రయత్నాలనుబట్టిచూస్తే కార్మిక వర్గానికి కాంగ్రెస్ ప్రాతినిధ్యం వహించదని స్పష్టమవుతుంది. కాంగ్రెస్ నూత్న నిబంధావళిలో వచ్చిన మార్పుల ఫలితంగాను, పైన వివరించిన పరిస్థితుల ఫలితంగానూ, దీర్ఘకాలంగా కాంగ్రెస్‌తో తమకున్న సంబంధాన్ని సోషలిస్టులు తెగతెంపులు చేసుకోవలసి

(3-వ పేజీ చూడుడు)

## ప్రాతిపదికవిద్యావిధానం

### జులై నుండి ఢిల్లీ రాష్ట్రములో అమలు

న్యూఢిల్లీ, మార్చి 20: 1948 సం॥ జులై 1 తేదీనుండి ప్రాతిపదికవిద్యా విధానమును ఢిల్లీ రాష్ట్రములో అమలుచేయ నిర్ణయింపబడెనని ఒక ప్రకటన తెలుపుచున్నది. మొదటి సంవత్సరములో ఢిల్లీ రాష్ట్ర గ్రామ సీమలయందలి 6, 7 సంవత్సరముల వయస్సుకల బాలురందరికి ఉచిత నిర్బంధ ప్రాథమికవిద్య నేర్పెదరు. తరువాత ఈవిధముగను అంతకంటె పెద్ద బాలురకు ప్రారంభించెదరు. ఈస్కీమును అమలు చేయుటకు రాబోవు సంవత్సరము 150 క్రొత్త పాఠశాలలు నేర్పరుపవలచుచున్నారు. మొదటి 50 పాఠశాలలను రాబోవు జులైలో తెరిచెదరు ఢిల్లీరాష్ట్రములో ఈ స్కీమును అమలుచేయుటవల్ల కలిగిన అనుభవము యితర రాష్ట్రములకు ప్రయోజనకారిగానుండునని, ఆశింపబడుచున్నది. క్రొత్త పాఠశాలలకు ఉపాధ్యాయులను నియమించుటలో ఉపాధ్యాయులుగా నుండిన శరణాగతులకు అభిమానం చూపెదరు. ఉపాధ్యాయుల శిక్షణమునకు గల సౌకర్యములను విస్తరించుటకుగూడ ప్రభుత్వము సర్వప్రయత్నములు గావించుచున్నారు. ఇందుకుగాను రెండు శిక్షణ పాఠశాలలను యేర్పరుప సంకల్పించుచున్నారు. ఇందులో ఒకటి స్త్రీలకు, ఒకటి పురుషులకు, ఈ ఉపక్రమణికగా జమియా మిలియాలో ఉపాధ్యాయుల శిక్షణమునకు యేర్పాటులు గావింపబడుచున్నవి. మొదటిజట్టు శిక్షణము 1948 సం॥ మేలో ప్రారంభమగును. మొదటి కొలదిజట్లకు కొద్దికాలంమాత్రము శిక్షణ మొసంగెదరు. కాని వారికి సంపూర్ణముగ శిక్షణ మొసంగెదరు. తరువాత శిక్షణ పొందుజట్లకు శిక్షణకాలం పొడిగించెదరు. ఈస్కీము బాగుగా అమలులోనికి వచ్చినతరువాత యువకులకు, వయోజనులకు సాంఘిక విద్య నేర్పుటకు ఈపాఠశాలలను ఉపయోగింప వీలగునని ఆశింపబడుచున్నది. అ. ప్రె.

# సత్వర పారిశ్రామికాభివృద్ధే రాష్ట్రప్రభుత్వలక్ష్యము

## శాసనసభలో మంత్రి శ్రీ సీతారామరెడ్డి వివరణ

### గృహపరిశ్రమల విషయంలో ప్రభుత్వం ప్రత్యేకశ్రద్ధ వహించాలని సభ్యుల సూచనలు

మదరాసు, మార్చి 20: నేటిదినం ఫలహారానంతరం అసెంబ్లీ తిరిగి సమావేశమైనపుడు కోరం లేకపోయింది. గంటను మ్రోగించి సభ్యులను రప్పించడం జరిగింది.

ఆతరువాత పరిశ్రమలశాఖ మంత్రి శ్రీ హెచ్. సీతారామరెడ్డిగారు పరిశ్రమలశాఖ వ్యయమునకై రూ 18086100 లను మంజూరు చేయవలసిందిగా కోరుతూ ఈ విషయంలో ప్రభుత్వ విధానమును యీవిధంగా వివరించిరి. చెన్నరాజధానిలో శీఘ్రంగా పరిశ్రమాభివృద్ధి గావించవలెనని ప్రభుత్వం ఉద్దేశ్యమైయున్నది. కొన్ని పరిశ్రమలను ప్రభుత్వమే చూచుకొంటున్నదనియు, మరికొన్నిటిలో ప్రభుత్వానికి వాటాయుంటుందనియు వచ్చిరి. తతిమ ప్రైవేటు పరిశ్రమలకు ప్రోత్సాహం యివ్వడమే ప్రభుత్వ విధానమనిరి. ఇతర దేశాలనుండి యంత్ర సామగ్రి రావడం కష్టంగానున్నది. పరిశ్రమలన్నిటినీ జాతీయమొనర్పవలెనని పలుమార్లు సభలో సూచనలు గావింపబడినవి. భారీపరిశ్రమలు, యినుము ఉక్కు మున్నగులోహాలకు సంబంధించినవి ప్రైవేటు కంపెనీలకు వదలవీల్లేదు. ఏలనగా అట్టి ప్రైవేటు కంపెనీలకు వాటిమీద సర్వహక్కులివ్వడం శ్రేయస్కరంకాదు. అదియును గాక యీ భారీ పరిశ్రమలను నిర్వహించుటకు తగినంత ధనముకూడా ప్రైవేటు వ్యక్తులవద్ద లేకపోవచ్చు. అందువల్ల కొన్ని పరిశ్రమలను మాత్రమే ప్రభుత్వం తీసుకొని జాతీయమొనర్పవచ్చును గాని ఉక్కుసైలం మిల్లులు మొదలగు పరిశ్రమలన్నిటిని జాతీయమొనర్పడం ప్రస్తుతం సాధ్యంకాదు. రాజమహేంద్రవరం పేపరుమిల్లును కొనుటకు ప్రభుత్వం కూడా కొందరు దాఖలుచేసియున్నదనియు, కొందరు తమవరమైతే ప్రభుత్వం వారామిల్లును కొని నిర్వహింపగలరని పలికిరి. రాయలసీమలో భూగర్భ పరిశోధనలు విశేషంగా జరుపవలసియున్నది కావున భూగర్భ శాస్త్రజ్ఞులనక్కడ నియమింప దలచియున్నామనిరి. పరిశ్రమల పరీక్షనమునకుగల టెక్నికల్ వ్యక్తులు బహుకొద్దిగా నున్నందున అట్టివారిని తర్ఫీదు చేయుటకు ప్రభుత్వం ఏర్పాట్లుచేయవలసియున్నదని కూడా నుడివిరి. మృణ్మయ పరిశ్రమ చేతిగాగిత పరిశ్రమ కొన్ని రసాయనిక ద్రవ్యముల పరిశ్రమలను ప్రభుత్వం నిర్వహిస్తున్నదనియు, యితర ప్రైవేటు కంపెనీలకు

(3-వ పేజీ చూడుడు)

## సంస్థానాల ఏకీకరణ కలాపం

### విమర్శలకు వి. పి. మీనన్ సమాధానం

బొంబాయి, మార్చి 20: ఇక్కడ ఈ రోజు జరిగిన పత్రికా విలేఖరుల సమావేశంలో ఇండియా ప్రభుత్వ సంస్థానశాఖ కార్యదర్శి వి. పి. మీనన్‌గారు ప్రజాభిమతానికి ప్రతికూలంగా స్వదేశ సంస్థానాలను తమ శాఖ ఒక ధోరణిలో నడుపడానికి ప్రయత్నిస్తున్నదనే దురభిప్రాయం కొందరికి కలిగినట్లు తెలుస్తున్నదనీ, ఇట్టి దురభిప్రాయానికి తావులేదనీ సంస్థానాల ఏకీకరణ ప్రజాప్రతినిధుల సంపూర్ణ ఏకీభావంతోనే సాగుతున్నదనీ తెలియజేశాడు.

సర్దార్ పటేల్ సంపూర్ణ స్వస్థత చేకూరంగానే పునరారోగ్యాన్ని పొందుతున్నారని కూడా మీనన్‌గారు అన్నారు. (యు. ప్రె.)

# కేంద్రప్రభుత్వపన్నుల ప్రతిపాదనలను సవరణచేసే అవకాశం

## 3 వేల రూపాయలుమించితేనే ఆదాయపుపన్ను?

న్యూఢిల్లీ, మార్చి 20: ఆర్థికశాఖామంత్రి ప్రతిపాదించిన కొత్తపన్నులు, సభికుల విమర్శలను పురస్కరించుకొని, ఈ క్రింది విధంగా సవరించబడ వచ్చునని తెలుస్తున్నది :—

(1) ఆదాయపు పన్నును రూ 2500 నుంచిగాక 3000 నుంచి విధిస్తారు.

(2) కాఫీ టీలమీద విధించ దలిచిన పన్నును సగానికి సగం తగ్గిస్తారు.

(3) అన్నుమీద మునిసిపాలిటీపన్నులు యథాపూర్వంగా ఉంచబడతవి. ఈ సవరణవల్ల ప్రభుత్వానికి ఆదాయంలో వచ్చే లోటు, పాకిస్తాన్‌కు ఎగుమతి అయే సరకులమీద లభించే సుంకాలవల్ల తేల్చినా రాడిపోతుంది.

## ఫ్రెంచి ఇండియా భవిష్యత్తు

### ఢిల్లీకి ప్రజాప్రతినిధుల ప్రయాణం

పుదుచ్చేరి, మార్చి 20: ఫ్రెంచి ఇండియా ప్రజాపరిషత్తు ప్రతినిధులు ఆర్. పురుషోత్తమన్, ఎన్. ఆర్. సుబ్రహ్మణ్యం, సమాచారకర్తలు ఫ్రెంచి ఇండియా భవిష్యత్తును గురించి కాంగ్రెస్ నాయకులతో చర్చించడానికి ఢిల్లీకివెళ్లారు. నాగరాజన్, ధీరన్ అను మరి ఇద్దరు ప్రజాప్రతినిధులుకూడా ఢిల్లీకి వెళ్లుతున్నారు. (యు. ప్రె.)

# సంస్థానాధీశ్వరుల స్వంతఆస్తి: కేంద్రప్రభుత్వవిచారణసంఘం

న్యూఢిల్లీ, మార్చి 20: అనేకమంది సంస్థానాధిపతులు సంస్థానపు అక్కౌంట్లలోంచి పెద్దపెద్ద మొత్తాలను స్వంత ఖాతాలలోకి మార్చుకుంటున్నారని తెలిసింది. ప్రభుత్వసంస్థానశాఖవారు ఈ విషయమై దర్యాప్తు జరుపడానికి విస్తృతాధికారాలుగల ఒక విచారణ సంఘాన్ని త్వరలో నియమించబోతున్నారు. సంస్థానాధిపతులు అగస్టు 15 నుంచి పెద్దపెద్ద మొత్తాలుపెట్టి షేర్లు సెక్యూరిటీలు కొనడం మొదలెట్టారు. రిజర్వుబాంకు ఈ లెక్కవుకు వ్యతిరేకంగా కోశాలబాంకు ఇటీవల అనేక బేరర్‌బాండ్లు జారీచేసిందట ఈ విషయాన్ని దర్యాప్తు చేయడానికి రిజర్వుబాంకువారు కూడా ఒక విచారణసంఘాన్ని నియమించాలని ఆలోచిస్తున్నారు.

## ఉదయపూర్‌లో బాధ్యతాయుతప్రభుత్వం

### రాయబారాలు

ఉదయపూర్, మార్చి 20: ఉదయపూరులో బాధ్యతాయుత ప్రభుత్వస్థాపనకై సంస్థాన ప్రధాని సర్ ఎస్. వి. రామమూర్తిగారికిని ప్రజామండలి నాయకులకును రెండురోజులనుండి రాయబారములు జరుగుచున్నవి. సంభాషణలు సుహృద్భావమున జరిగెనని త్వరలో ఒడంబడిక కుదరవచ్చునని ప్రధాని ఒక ఇంటర్వ్యూలో చెప్పెను. మంత్రివర్గములో ప్రజామండలి మంత్రులసంఖ్య, ఇతరపార్టీల మంత్రుల సంఖ్య సమానముగా నుండవలెనని ప్రభుత్వము పట్టుబట్టుచుండ, తాము అధికసంఖ్యాకులుగా నుండవలెనని ప్రజామండలివారు కోరుచున్నట్లు తెలియుచున్నది. ఇటీవల మేవాడు ఎసెంబ్లీకి సామాన్య నియోజకవర్గములనుండి 8 మంది అభ్యర్థులు పోటీలేకుండా ఎన్నుకొనబడిరి. అ. ప్రె.

కావలెను

ఆకర్షణీయమైన షరతులపై "తారు బార్ సోపులకు" దక్షిణ యిండియాలో ప్రతిచోట పలుకుబడిగల స్టాకిస్టులు కావలెను.

వివరములకు:

A. K. THARU SONS,
Soap Dept., Post Box No. 14, Coimbatore.

# వితంతువైతే
## సంభవించు దుర్దశలు

వితంతువు కావడంతో స్త్రీకి తనసుఖదాయకమైన సాధారణ నిత్యజీవనము అంతరించిపోవును. తన భవిష్యత్తు అంధకార బంధురమైన కొలది గత సుఖానుభవములు స్మరణకు వచ్చును. ఏకాకిగా, దిగులు చింత దారిద్ర్యములతో జరుపవలసిన జీవిత పోరాటమునకు ప్రారంభము.

ఆయితే భీమా ఆమె జీవితమున ఎంతో మార్పు కలిగింపగలదు.

న్యూ ఏషియాటిక్
ఇన్స్యూరెన్సు కంపెనీ లిమిటెడ్.,
జీవితము, అగ్ని, నౌక, ప్రమాదములు, ఎయిర్‌క్రాఫ్టు, విమాన ప్రయాణీకులు, మోటారుబండ్లకు మొదవపోర్టు రిస్కుల భీమావ్యాపారము చేయబడును.
హెడ్డాఫీసు: న్యూఏషియాటిక్ బిల్డింగు, కనాట్ సర్కస్, న్యూఢిల్లీ. మద్రాసు బ్రాంచి: 289, లింగిచెట్టివీధి, జి.టి. మద్రాసు, కాలికట్ బ్రాంచి: రాధాటాకీసు కాంపౌండ్, హజూరురోడ్డు, మైసూరు బ్రాంచి: శ్రీ జయచామరాజేంద్రరోడ్డు, బెంగుళూరు సిటీ, ఆంధ్రబ్రాంచి: గాంధీనగర్, బెజవాడ, తిరుచినాపల్లి: చిన్నకడై వీధి, శ్రీరంగపట్నంలోపేట.


### కావలెను

ధవళేశ్వరం సర్కిలులో ప్లోడ్రయివరు (Plough driver) పనికి ధవళేశ్వరం సర్కిల్ సూపరింటెండింగు యింజనీరు గారికి 5-4-1948 లోగా చేరునట్లు దరఖాస్తులు కోరబడుచున్నవి.

2. ప్రతి దరఖాస్తుదారు సమీపమున గల ట్రెజరీలో రు. 10/-లు చెల్లించి, సదరు ట్రెజరీ చెలానాను దరఖాస్తుతో జతపరిచి పంపవలెను.

దరఖాస్తు ఫారము వగైరాల గురించిన వివరములు, ఆయా ప్రదేశములలోని ఎగ్జిక్యూటివ్ యింజనీర్ల ఆఫీసులలో తెలిసికొనవచ్చును.

పి. వెంకటరమణరాజు,
సూపరింటెండింగ్ యింజనీర్.

### నోటీసు

మద్రాసు స్మాల్ కాజ్ కోర్టు
దావా నెం. 26 ఆఫ్ 1948

వాది: రాజునాయుడు,

ప్రతివాది: నరసయ్య చెట్టి, చెంగల్పట్టు జిల్లా, కలత్తూర్ గ్రామం, తిరుత్తని తాలూకా.

నీవు తీసికొన్న రు. 1,224/-లు రాబట్టుకొనుటకు నీమీద వేసిన పై దావా చీఫ్ జడ్జిగారి యెదుట 31-3-48 తేదీ పగలు 10-45 గంటలకు విచారణకు వాయిదా వేయబడినది. ఆరోజు నీవు హాజరు కానిచో నీ పరోక్షమున డిక్రీ పొందబడును.

ఎస్. అన్నసాధక్, ఎం. ఏ. బి. ఎల్.
వాదితరఫు అడ్వకేటు,
నెం. 3, తంబుచెట్టివీధి, జి. టి. మద్రాసు.


# కుటీర పరిశ్రమలలో
# సాటిలేని కళలు, వృత్తులు

ఆకర్షణీయమైన బహుమతివస్తువులు
సరసమైన ధరలకు దొరకును.
చేరుగాంచిఎంగ్రేవుచేసినబంగారు, వెండి, బిద్రి గుండీలు, లింకులు, స్టడ్సు, ఆష్ ట్రేలు, పాత్రలు, నగలపెట్టెలు వగైరా.
పేరొందిన వెండి చిత్రపువస్తువులు
సిగరెట్ కేసులు, పాత్రలు, ట్రేలు, టీసెట్లు, సెంటు మరియు చాకు పిడులు కంటివి.
అనేక డిజైనుల బ్రోచీలు వగైరా.
హింరూ, మష్రూ వస్త్రములు
దుస్తులకు, అలంకారపు పనులకు
పైఠాన్ చీర అంచులు, పుల్లోస్
ప్రాచీన ఆధునిక డిజైనుల తివాసీలు
కొరకు స్థలము:
గవర్నమెంట్ కాటేజి ఇండస్ట్రీస్
సెల్సుడిపో, గన్‌ఫౌండ్రి.
హైదరాబాదు-దక్కన్.


## పశ్చిమ గోదావరినుండి బియ్యం అక్రమ రవాణా

### రైతుల ఆందోళన

ఏలూరు, మార్చి 17: బియ్యంపై కంట్రోలు తీసివేసినప్పటినుండి, కృష్ణా గుంటూరు జిల్లాలకన్న ఇచ్చట బియ్యం చౌకగా లభించుచున్నది. అందువల్ల ప్రతిదినం ఇచటనుండి వందలకొలది బస్తాల బియ్యం అక్రమముగా ఆ జిల్లాలకు రవాణా అగుచున్నది. బెజవాడ, గుంటూరులనుండి వందలకొలది జనులువచ్చి, తలకొక అరబస్తా, లేక బస్తా చొప్పునకొని రైళ్ళలో తీసికొని పోవుచున్నారు. తపరుపేట స్టేషను నుండి మద్రాసువైపు పోవుబండికి ఈ విధముగా 2, లేక 3 వందలబస్తాలు బియ్యం ఎగుమతి అగుచున్నది.

ఈ విషయములో ఒకే ఒకసారి పోలీసువారు చర్యతీసికొని, సుమారు 150 బస్తాలబియ్యం పట్టుకొని కేసులు పెట్టినారు అవి యింతవరకు తేలలేదు. తరువాత ఈ విషయమై చర్య ఏ కొనసాగలేదు.

ఇందు విషయమై విచారించగా, తపరుపేటలో బియ్యపుమూటతో రైలు ఎక్కినంత మాత్రమున నేరం లేదని బియ్యము సరిహద్దుదాటి కృష్ణాజిల్లాలో ప్రవేశించినపుడే, నేరమగునని, కృష్ణా జిల్లాలో ప్రవేశించినపుడు ఆ జిల్లా అధికారులు చర్య తీసికొనవలసి యుండునని, అధికారవర్గముల అభిప్రాయమైనట్లు తెలిసినది. ఇదిగాక ప్రతిరాత్రి వందలకొలది బస్తాలు మోటారులారీలమీదగూడ ఎగుమతిఅగుచున్నట్లు తెలియుచున్నది.

ఈ విధముగా ఈ జిల్లాలో మిగులు ధాన్యమంతా, ప్రభుత్వ లెక్కలలోనికి రాకుండా ఎగుమతి యైపోవుననియూ, పిమ్మట, అధికారులు, లెక్కలప్రకారం మిగులు అంతా యివ్వవలసినదని రైతులకు బాధించెదరనియు, జిల్లారైతులు భయపడుచున్నారు. (స్వ. వి.)

### ఆంధ్రలోని ఉత్పత్తి వినియోగదార్ల సహకారసంఘములు

#### శ్రీ సీతారామశాస్త్రిగారి విజ్ఞప్తి

బెజవాడ, మార్చి 19: శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారిట్లు వ్రాసిరి:

అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షులు డా॥ రాజేంద్రప్రసాద్ గారిని, సేవాగ్రామలో దర్శించి, ఆంధ్రదేశంలో గల తాలూకుజిల్లాలలోని ఉత్పత్తి వినియోగదార్ల సహకారసంఘముల దుర్భర పరిస్థితులనుగూర్చి నాకు తెలిసినంతవరకు తెలియజేసితిని. ఆంధ్రదేశంలోని సహకార సంఘములు ఎప్పుడు స్థాపింపబడినవో, యింతవరకు ఎంతలాభము పొందినవో, యీ సంఘముల విషయమై ప్రభుత్వము ఎటువంటి విధాన మవలంబించుచున్నదో మొదలైన పూర్తి వివరములను రాజేంద్రప్రసాద్ గారికి తెలియజేసినచో, ఆయన మదరాసు ప్రభుత్వముతో సంప్రదించి, యీ సంఘముల అభివృద్ధికి కృషిచేయ గలరని నా విశ్వాసము. కాబట్టి ఆంధ్రదేశంలోని ఉత్పత్తి వినియోగదార్ల సహకార సంఘముల వారందరు పై వివరములను నేరుగా రాజేంద్రప్రసాద్ గారికి పంపుచు నాకు కూడ ఒక ప్రతిని పంపవలసిందని కోరుచున్నాను.

### హైకోర్టు జడ్జీలు

మదరాసు హైకోర్టు క్రొత్తజడ్జీలు కె. వి. సుబ్బరావు పంచాపకేశశాస్త్రిగార్లు సోమవారం 22 తేదీ చార్జి పుచ్చుకొందురు. హైకోర్టు వేసంగి ఏప్రిలు 26 వ తేదిన మూయబడును. సెలవులలో జడ్జీలుగ శ్రీ యాహ్యాలి, జె. సత్యనారాయణగార్లు పనిచేయుదురు.

## ఇంగ్లాండు - ట్రాన్సుజోర్డాను ఒడంబడిక

అమాన్, (ట్రాన్సుజోర్డాన్) మార్చి 20: ఇంగ్లాండుకు ట్రాన్సుజోర్డానుకు మధ్య 1946 సం॥ లో ఒక ఒడంబడిక వ్రాసికొ బడెను. దానిని రద్దుచేసి క్రొత్త ఒడంబడిక నేడు వ్రాసుకొనబడెను. ఇది రేపు ట్రాన్సుజోర్డాను రాజను అబ్దుల్లాకు ంతకముందు సమర్పించబడును. ఈఒడంబడిక 20 సం॥ల వరకు అమలులో నుండును.

## ఇంగ్లాండు-ఇరాకు ఒడంబడిక

బాగ్దాద్, మార్చి 20: 1930 సం॥లో ఇంగ్లాండుకు ఇరాకు దేశానికి ఒక ఒడంబడిక జరిగెను. దానిస్థానే క్రొత్త ఒడంబడికను వ్రాసికొనుటకు ఇరాకు ప్రభుత్వం సిద్ధముగా నున్నదని ఇరాకు ప్రధాని సయ్యదు మహమ్మదు అల్ బాదా గాస్త్యరలోనే ప్రకటించనున్నారు. ఇరాకు నుండి బ్రిటిషుసేనలు తొలగింపబడవలెనని యీ యీ ఒడంబడికలో వ్రాసికొబడును.

## ఆంధ్ర ఐక్యత

### నాయకుల బాధ్యత: ప్రజా సేవకుల విధి

#### కాంగ్రెస్‌పక్ష నాయకత్వ పోటీలో ఆంధ్రుల స్థానం

ఆంధ్రరాష్ట్రం ఆలోచనలో పడిపోయింది. ఏప్రిలులో ప్రత్యేకాంధ్ర రాష్ట్రం ఏర్పడగలదని, ఆంధ్రుల వ్యవహారాలను ఆంధ్ర మంత్రులే చూస్తారని ప్రకాశం పంతులుగారు ఆశపెట్టారు. పండిట్ నెహ్రూ తమకు చెప్పిన మాటను బట్టి తాను అలా అనగలుగుచున్నా మన్నారు. ఇది విని కర్ణాటకులు ఆందోళన సాగించారు. వస్తే అన్ని భాషారాష్ట్రాలూ ఒకేసారి రావాలన్నారు; లేదా ఎవ్వరికీ ఇంతలో ప్రత్యేక రాష్ట్రం ఏర్పడరాదన్నారు. పండిట్ నెహ్రూ ఆంధ్రులను మందలించ, కలిగారుగాని కర్ణాటకులకు సలహా ఇవ్వలేక పోయారు. రాజ్యాంగ రచనా సంఘంవారికి షెడ్యూలులో ఆంధ్రరాష్ట్రాన్ని పేర్కొనవద్దని సలహాఇచ్చారు. ఫలితం ఆంధ్రరాష్ట్రం మళ్లీ ఆలోచనలో పడింది.

ఇలాటివి జరిగినప్పుడల్లా ఆంధ్రులందరూ ఏకం కావాలని అందరూ ఘోషిస్తూ ఉంటం మామూలైపోయింది. కాని ఆసలు ఐక్యతను సాధించడానికి ఎవ్వరూ ప్రయత్నించడంలేదు. మొన్న టివరకూ ఆంధ్రరాష్ట్ర ప్రథమ గవర్నరు ఎవరు? మొదటి ప్రధాని ఎవరు? అని ఆలోచించు కుంటూ ఆంధ్రులు సన్నాహాలు చేస్తున్నారు, ఇప్పుడు రాష్ట్రం సంగతి తేలకపోయే సరికి రాష్ట్రం ఏర్పడవలసిన ఈ సమయంలో ఆంధ్రులందరూ ఏకం కావాల, చెన్నరాష్ట్ర ప్రధానిపదవి ఆంధ్రునికే ఉండాలని, లేకపోతే సరిహద్దువిషయంలో చాలా అన్యాయం జరుగుతుందని అంటున్నారు. కాని సత్వర ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి మాత్రం అవసరమయిన కృషి చేయడంలేదు, జరగడంలేదు.

చెన్న రాజధాని బహుభాషా ప్రాంతం. శాసనసభలో, తమిళులకే సంఖ్యాబలం ఉంది. కనుక ద్రావిడుడే ఈ తరుణంలో ప్రధాని కావాలని ఆందోళన ప్రారంభిస్తే, లక్ష్యం సిద్ధించదు. శాసనసభ కాంగ్రెస్‌పక్షంలో తమిళులు 101 మంది ఉన్నారు ఆంధ్రులు 78, కేరళులు 12 కన్నడిగులు 6. వీరు మూడురూ ఏకమయినా తమిళులందరూ ఒక్కటిగావుంటే వార్లకే నాయకత్వం లభిస్తుంది. కాని తమిళులలో ప్రస్తుతం 3 కక్షు లున్నవనీ అందులో ఒకపక్షం- ఇందులో 16 మంది ఉన్నారని ప్రస్తుతం అంచనా- క్రొత్త నాయకుడు కావాలని వోటు చేస్తారనీ అంటున్నారు. తెలుగువారు 78 మందిలోనూ దాదాపు 60 మంది ప్రస్తుత మంత్రివర్గం మారాలని అంటున్నారని కొందరు చెప్తున్నారు. పోతే కేరళ, కర్ణాటకులలో ప్రస్తుత మంత్రివర్గానికి ప్రతికూలంగా ఉన్నవారు మొత్తంగా 10 మంది ఉంటారు. ఈ విధంగా అయినా మంత్రివర్గం మారాలనే వారు 90 మందికిలోపుగానే తేలుతున్నది అంటే తమిళులలో మూడవవర్గానికిచెందినవారు దాదాపు 20 మంది ఉన్నారనీ వీరు ఎవర్ని బలపర్చితే వారు నాయకుడుగా ఎన్నిక అవుతారనీ అంటున్నారు నేటి నుంచీ వివిధవర్గాల సమావేశాలు ప్రారంభమైనవి. 26 వ తేదీన ఎందరు అభ్యర్థులు తేలినా ప్రస్తుతం మద్రాసు నాయకత్వాన్ని కాంక్షిస్తున్నట్లు కనబడుతున్నది. ఇందులో ఏదైనా చేరినా మూడవ వారికి అవకాశం తగ్గిపోకదని అనుకుంటున్నారు.

ఆంధ్రుల్లోనే అధిక సంచలనం కన్పిస్తున్నది. కాని రాజీ ప్రయత్నాలు వక్రమార్గాన్ని అనుసరిస్తున్నాయని తెలుగు వర్గాలు రెంటికి చెందినవారు కొందరంటున్నారు. ఇప్పుడు మంత్రులుగా ఉన్న తెలుగువారిలో ఇద్దరు మాత్రం క్రొత్త మంత్రివర్గంలో ఉంటానికి వీల్లేదనీ, ఆ ఇద్దర్నీ వదలి మిగిలినవారందరూ ఐక్యం కావాలనీ తెలుగు నాయకత్వం కోసం ప్రయత్నిస్తున్న వారంటున్నారట ఫలానా వారు ఎన్నికలేనే తెనుగు నాయకత్వం ఏర్పడినట్లూ మరో తెలుగువాడు ఎన్నికైతే అలా కాదని వీరు ప్రచారం చేస్తున్నారు. ఐక్యత కావాలని వీరు చేస్తున్న ప్రథమ తప్పిదం ఇదేనంటున్నారు. మంత్రివర్గ ఆశీమానులు కాంగ్రెస్‌పార్టీ నాయకత్వం ఎలావున్నా అసలు ఆంధ్రులు అందరూ కలసి కట్టుగా పనిచేయాలనీ, ఐక్యత అనేది కేవలం శాసనసభ రంగస్థలిపైనేగాక రాష్ట్ర రాజకీయరంగంలోకూడా ఏర్పడాలని, సంధుల ఆపేక్షలు నాశమైపోతున్నవని బాధపడేవారు కొందరు అంటున్నారు పైగా శాసనసభ కాంగ్రెస్‌పక్ష నాయకత్వం విషయంలో "ఆంధ్ర ఆపేక్షలకు ప్రమాదం" అనేనినాదాలు నష్టానికరం అనికూడా వీరంటున్నారు ఇందుకల్ల ఆంధ్రకేసరుల ఐక్యతనే సాధించలేనంగా ఆంధ్రుల ఐక్యతను సాధింపలేరని వీరు హెచ్చరిస్తున్నారు.

## నిరంకుశత్వమునుండి మానవకోటి రక్షణ

### అమెరికన్లకు జార్జిమార్షల్ ఉద్బోధ

లాస్‌ఏంజలిస్, మార్చి 20: నిరంకుశత్వముతో మరల జరుగు పోరాటములో స్వాతంత్ర్యమును రక్షించు మహత్తరమైన కర్తవ్యము అమెరికను జాతిపై నున్నదని నేడు లాస్‌ఏంజలిసులో కాలిఫోర్నియా విశ్వవిద్యాలయము వందవర్ష నింపుచు అమెరికను మంత్రి జార్జిమార్షల్‌గారు హెచ్చరించిరి. ఇప్పుడు జరుగుచున్న ప్రపంచ పోరాటములో అమెరికా నేరకుండావుండజాలదని, స్వతంత్రజాతులు ఒకటితరవాత ఒకటి నాశనము చుండగా చూచుచు ఊరకుండజాలదని చెప్పుచు జార్జిమార్షలు యిట్లనెను:—

"అమెరికా వెంటనే దృఢమైన చర్యనే కొన్న యెడల పశ్చాత్తాప పరిస్థితి చక్కబడు అవకాశముండును. ఈ కాలములో అమెరికాపై యున్న బాధ్యతతో సమానమైన బాధ్యత నవీనచరిత్రలో ఏజాతిపైనను లేకుండెను. ఈ 10 సంవత్సరములలో ఒక మహత్తరమైన బాధ్యత మనపై పడినది. ప్రపంచములో యిప్పుడుమనుగల స్వేచ్ఛను, నిరంకుశత్వమునకు, స్వాతంత్ర్యమునకు, స్వాతంత్ర్యాపహరణకు పోరాటము జరుగుచున్న దనుట స్పష్టము. నాజీయిజం పశిత్వము యిప్పుడు మరల ఐరోపాలో బొయచున్నది. ఈదేశములోను, ఇతర దేశములలోను వున్న సోవియట్ యూనియను కమ్యూనిస్టుపార్టీలు ఐరోపాదేశములు ఐరబలీనుమును కొల్లగొని, ప్రజాపాలక స్వతంత్రరాజ్యములు కాకుండ చేయుటకు తాము చేయగలదంతయూ చేసి తీరునని యిప్పుడు మనకు తెలిసియున్నది.

### మే 17 న రాజ్యాంగ పరిషత్తు సభ?

న్యూఢిల్లీ, మార్చి 20: భారత రాజ్యాంగ పరిషత్తు మహాసభ, మే 17 వ తేదీన సమావేశమై నూతన్న రాజ్యాంగపు ముసాయిదాను పరిశీలించుందని తెలుసున్నది. (యు. ప్రె)

ఆంధ్రుడు ప్రధానిగా రావడానికి అందరూ తీవ్రంగా కృషి చేయాల్సిందే గాని జరూరుగా ఆంధ్రప్రజల లక్ష్యమని లక్ష్యించి, ఇతర ప్రధానసమస్యల విచారించకపోవుట సరియైన పద్ధతి గాదని పలువురుభావిస్తున్నారు.

"ఆంధ్రఐక్యతకుగలమార్గం ఒక్కటే మనకు ఈనాడు నాయకులు అసంఖ్యాకంగా ఉన్నా మనకు నాయకత్వం అనేది లేదు. నాయకత్వం యేర్పడవలె మన ఐక్యతకు నిదర్శనం ఆ నాయకత్వాన్నె ఏర్పాటుచేసే బాధ్యత నాయకులపైనే ఉంది. రాజకీయరంగంలో మనకు ప్రస్తుతం నాయకులుగా ఉన్నవారు డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు, టంగుటూరి ప్రకాశం పంతులుగారు రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు, కాంగ్రెస్ కార్యవర్గసభ్యుడు రంగాగారు. బెజవాడ గోపాలరెడ్డి, కళా వెంకట్రావు, కల్లూరి సుబ్బారావు, ప్రభృతులున్నారు. వీరు 10 మంది చేరి అందరెల్లవరకూ ప్రస్తుత విభేదాలను, వివాదాలను విరమించి, ఒకరితో ఒకరు ఘర్షణకు రావద్దేమాని, కలసి కట్టుగా పనిచేస్తామని తీర్మానించుకోవాలి. ఈ విధమైన 'ట్రూస్' — "పొలిటికల్ ట్రూస్" — ప్రకటించుకోవాలి. వ్యక్తులను, విధులను కేటాయించుకొని పనిచేయాలి. ఒకరిపై ఒకరు కత్తికట్టడంగాని పాతగాధలను త్రవ్వి కార్పణ్యంతో ప్రవర్తించడంగాని కూడదు. ఇలా జరిగితే ఆంధ్రులకు నాయకత్వం ఏర్పడుతుంది. ఇందులో ఏ ఒక్కరిని మినహాయించి మిగతావారందరూ ఏకమూకావాలని ప్రయత్నించినా ప్రయోజనంలేదు. అగ్రనాయకత్రయంతో ఒకసంఘం ఏర్పరచుకొని వారి నిర్ణయాన్ని శిరసావహిస్తూ ఉండాలి. అప్పుడే ఐక్యతా నినాదాలకు అర్థం ఉంటుంది." అని ఒకప్రముఖ ఆంధ్రనాయకుడు అన్నాడు.

కాని నాయకులను, వారి అనుచరులు ఏకం కానివ్వరని, స్థానిక వ్యక్తిగత వివాదలను, రాష్ట్ర రాజకీయాల్లో కలిపివేసి ప్రతిది ఒకవర్గ, మూఠాసమస్యగా చేయడ మారుతున్నదని కనుక ఐక్యనాయకత్వం సాధ్యంగాదని కొందరు అంటున్నారు. కాంగ్రెస్ సేవకులు ఈ పరోక్షణలు నిర్మూలనకుని బుజువుచేసుకొని ఐక్యనాయకత్వంకోరకు కృషిచేస్తేతప్ప ప్రజాజనంచేతకూడా వీరి అభిప్రాయం. అయితే నాయకులు తమ బాధ్యతల రాష్ట్ర క్షేమాన్ని దృష్టించి ప్రవర్తిస్తే తామూ వారి ఆదేశాలను శిరసావహిస్తామని కాంగ్రెస్ సేవకులు అంటున్నారు.

కాంగ్రెస్ శాసనసభాపక్ష నాయకత్వం ఎన్నికల పురస్కరించుకొని ఆంధ్రులందరూ ఈ ఐక్యతకు సాధకులు కృషిచేస్తే చెన్నరాష్ట్ర ప్రధానామాత్యత నాక ఆంధ్రరాష్ట్రం కూడా లభించగలదని అధిక సంఖ్యాకుల అభిప్రాయమై ఉన్నది. మంత్రివర్గాన్ని మార్పులేనివారే ఈ వాదనన్న కురం. వారలనే కాం ఎక్కువగా ఉంది.

## గాంధీజాతీయ స్మారకనిధి

### కార్యదర్శి విజ్ఞప్తి

న్యూఢిల్లీ, మార్చి 20: గాంధీజాతీయ స్మారకనిధి సంఘ కార్యదర్శి ఈ క్రింది విధంగా ప్రకటిస్తున్నారు:

"ఈ స్మారకనిధి ఏ విధంగా వినియోగిస్తారో తెలియచేయవలసినదని మమ్మల్ని అనేకులు కోరుతూ ఉత్తరాలు వ్రాస్తున్నారు. కాంగ్రెస్ అధ్యక్షుడు డా॥ రాజేంద్రప్రసాద్ ఫిబ్రవరి 13 వ తేదీన విజ్ఞప్తిలో ఈ అంశాన్ని స్పష్టంచేశాడు. ఈ నిధిని గాంధీజీ నిర్మాణ కార్యక్రమాలను ఆచరణలో పెట్టటానికి, ఆయన ఆశయాలకు సమగ్రస్వరూపాన్ని ఇవ్వటానికీ ఈనిధి ఉపయోగపడుతుంది. గాంధీజీ రచించిన వివిధవ్యాసాలనూ, గ్రంథాలనూ ఉపన్యాసాలనూ, ఉపదేశాలనూ, కూర్చి సమగ్రంగా వివిధ భాషల్లోనూ ప్రచురించటం, గాంధీజీకి సంబంధించిన వివిధ వస్తువులనూ చేర్చి ఒక ప్రదర్శనాలయంలో ఉంచటం, కూడా ఈ నిధికలన జరుగుతుంది.

పండిత నెహ్రూ సర్దార్ పటేల్ వంటివారైన ప్రముఖులందరూ లాంఛనప్రాయాలు గాంధీజీ స్మారక చిహ్నాలకై శిలా చిహ్నాలు నిర్మించటంలో ధనవ్యయం చేయవద్దని హెచ్చరించివున్నారు. స్థానికంగా స్మారక చిహ్నాలు వెలిసేటందుకు నిధులు వసూళ్లు జరుగుతున్నవని తెలుస్తున్నది. అంతా కేంద్రనిధి వసూలుకే తోడ్పడాలని కాంగ్రెసు అధ్యక్షుడు చేసిన విజ్ఞప్తిని మరిగీ జ్ఞాపకం చేస్తున్నాను. అదీకాక, వసూళ్లలో అధిక భాగం స్థానికంగానే ఖర్చు పెట్టబడుతుందని కూడా గమనించాలి. ప్రతివ్యక్తి, కనీసం 10 రోజుల సంపాదనయినా ఇవ్వాలని విజ్ఞప్తి చేయబడింది. అంతా ఆ విధంగానే ఇచ్చి తీరాలని నిర్బంధమూ లేదు; అంతకన్నా ఎక్కువ ఇవ్వకూడదనీ నియమంలేదు."

### అహ్మదాబాద్ కార్మికుల వసూలు

అహ్మదాబాద్ మజూర్ మహాజన్ సంఘంవారు గాంధీజీ స్మారకనిధికి 8,25,000 రూపాయలను వసూలుచేసి ఇచ్చారని నిధి కేంద్రసంఘం తెలియజేస్తున్నది. ఈ మొత్తాన్ని గాంధీజీ ఏర్పరిచిన కార్మిక కార్యక్రమానికి వినియోగించాలని వారు కోరారు. ఇంకా ఇతర వసూళ్ళు అహ్మదాబాద్‌లో జరుగుతున్నవి.

## రేవామహాజీ మహారాజా గులాబ్‌సింగ్ అరెస్టు

అలహాబాదు, మార్చి 20: మాజీరేవా సంస్థానాధిపతి అయిన సర్ గులాబ్‌సింగును పోలీసులు నిన్న అలహాబాదులో అరెస్టుచేసి ఢిల్లీకి తీసుకొని వెళ్లారు. సర్ గులాబుసింగు ఇపుడు ఢిల్లీలో సెక్రెటేరియటులో నిర్బంధించబడియున్నాడు.

రేవా భారత ప్రభుత్వాల సంబంధ బాంధవ్యాలకు ప్రతిబంధకంగా ఉన్నారని చెప్పి సర్ గులాబుసింగును అరెస్టు చేయుటకు ఇండియా గవర్నర్‌జనరల్ ఉత్తర్వు జారీచేశాడు. రేవా సంస్థాన భవిష్యత్తు ప్రజా ప్రభుత్వమే నిర్ణయించాలనీ, రేవా ప్రజలకోసం తన పూర్వీకుడైన మహారాజా అనూరాగ్‌సింగ ప్రాణాలు త్యాగం చేసినట్లే తానుకూడా కారాగారవాసం చేయడానికి సిద్ధంగా ఉన్నాననీ, అరెస్టు కాబోయేముందు మహారాజా ఒక ప్రకటనచేశాడు.

### స్వరాజ్యభవనం ఇక గాంధితత్వ పరిశోధనాలయం?

కాశీ, మార్చి 20: అలహాబాద్‌లోని స్వరాజ్యభవనాన్ని త్వరలోనే గాంధి తత్వ పరిశోధనాలయంగా మార్చబోతున్నారని తెలుస్తున్నది. ఇప్పటివరకూ ఈ భవనంలో ఏ. ఐ. సి. సి. ఆఫీసువున్నది.

### మిస్సు మసానీ బ్రెజిల్‌లో రాయబారి?

న్యూఢిల్లీ, మార్చి 20: ఇటీవలవరకు సోషలిస్టు ప్రముఖుడుగావున్న ఎం. ఆర్. మసానీగారి భారత ప్రభుత్వం బ్రెజిల్‌లో రాయబారిగా నియమించినట్లు తెలుస్తున్నది. ఏప్రిల్ నెలలో వీరు బ్రెజిల్ వెళ్లి పదవిని స్వీకరిస్తారు.

మౌలానా ఆజాద్ కు ప్రైవేటు కార్యదర్శిగావున్న జే. కే. ఆటాల్ గారు బ్రెజిల్‌లో భారత రాయబారికి కార్యదర్శిగా పనిచేస్తారు. (యు. ప్రె)

## ఫ్రాన్సు-ఇటలీ ఒడంబడిక

ట్యూరిన్, మార్చి 20: ఫ్రాన్సు-ఇటలీకి మధ్య జరిగేటి రవాణాల సుంకములు గూర్చిన ఒడంబడిక యొకటి ఉభయదేశముల మధ్య వ్రాసికొబడినది. ఇటలీ విదేశాంగమంత్రి కవుంటు స్ఫోర్జా, ఫ్రెంచి విదేశాంగమంత్రి జార్జి బిడాల్టులున్నా నేడు ఇటలీలో పాలాజో మాడమాను అను రాజభవనంలో యీ ఒడంబడికమీద సంతకములు చేసిరి.

ఒక వ్యాపార ఒడంబడికకూడా వ్రాసికొబడెను. ఈ ఒడంబడికవల్ల ఉభయ రాజ్యాల వ్యాపారము మూడురెట్లు వృద్ధి యగును.


ఇండియన్ బ్యాంక్ లిమిటెడ్,
మద్రాసు.

| | | |
|---|---|---|
| అనుమతిపొందిన మూలధనము | రు | 1,00,00,000 |
| చందాచేయబడిన మూలధనము | రు | 72,00,000 |
| పిలువబడి, చెల్లించబడిన మూలధనము | రు | 53,00,000 |
| రిజర్వు ఫండు | రు | 62,00,000 |

ఈ హెడ్డాఫీసులోను, దక్షిణ ఇండియాలో గల యీ బ్యాంకు యొక్క బ్రాంచీలలోను, మూడు నెలలు ఆరుమాసములవరకు రు. 10,000/-ల అంతకు పై మొత్తములకు దిగువ వడ్డీరేట్ల ప్రకారము ఫిక్సుడ్ డిపాజిట్లు తీసుకొనబడును:—

| | | |
|---|---|---|
| 3 నెలలకు | సాలుకు | 2¼% |
| 4 & 5 నెలలకు | ,, | 2½% |
| 6 నెలలకు | ,, | 2¾% |

ఈ విధంగా తీసుకొబడిన డిపాజిట్లు 30 సెప్టెంబరు 48 తర్వాత నిలవ చేయించనీయబడవు. (బోర్డువారి అనుమతిని)

ఎన్. గోపాల అయ్యర్, కార్యదర్శి.



లివరుజెన్
లివర్‌ను బాగుగాపనిచేయించు నట్టి టానిక్
స్టాండర్డ్ ఫార్మస్యూటికల్ వర్క్సు లిం., కలకత్తా



పాండియన్ ఇన్స్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్.
(ఇండియాలో స్థాపితము: 1933)
హెడ్ ఆఫీసు: మధుర.
ఉన్నత సేవచేయుచున్నది.
అగ్ని, మోటారు, ప్రమాదములు మొదలగు భీమాలను నిర్వహించును.
మొత్తము ఆస్తులు రూ 65,00,000
బ్రాంచీలు: బొంబాయి, అహమదాబాదు, కలకత్తా, రావల్‌పిండి.
చీఫ్ ఏజంట్లు: ఏ. అండ్ ఎఫ్. హార్వీ లిమిటెడ్, మధుర.
కె. యం. ఎస్. లక్ష్మణ అయ్యరు అండ్ సన్సు,
మధుర, తిండివనం, మద్రాసు, నగరి, బెజవాడ, కాకినాడ, విజయనగరము.



చర్మవ్యాధుల నివారణకు శీఘ్ర చికిత్స
నివారణకమైన క్యూటికూర ఆయింటుమెంటు (Cuticura Ointment) చర్మ ఆరోగ్యమును శీఘ్రముగా చేకూర్చి చిల్లర చర్మవ్యాధులను పోగొట్టును. చర్మమును పరిశుభ్రముగా నుంచును.
కోతలకు దెబ్బలకు కురుపులకు
557
క్యూటికూర ఆయింట్‌మెంటు
CUTICURA OINTMENT



"మీ దంతవైద్యుని చూడండి
మీ దంతములగురించి తెలిసికొనండి"
మీ దంత వైద్యుని చూడండి, మీదంతములగురించి తెలిసికొనండి. నీం టూత్ పేస్టు వాడినతరువాత కలుగు మార్పును గమనించండి. నీం టూత్ పేస్టుయొక్క గుణములు అది అందరికి ఆదరణపాత్రమైనది. మంచి దంతవైద్యుడు మంచి టూత్ పేస్టు దండగకాదు. దంతవైద్యులకు యిచ్చేడబ్బు ఆదా చేసుకోవడం, టూత్ పేస్టు ఖర్చు తగ్గించడం, పొడిమిలో చేరదు. దంతముల రక్షణకు, నీం టూత్ పేస్టు శ్రేష్ఠమైనది.
Neem
"నీం"
వేపవేళ్ల గుణములు కలిగిన టూత్‌పేస్టు యిది యొక్కటే.
Calcutta Chemical.
COPYRIGHT, CALCUTTA CHEMICAL J.H.2

# "మనవిద్యావిధానం భారతదేశ విజ్ఞాన విశిష్టతను బోధపరిచేదిగా వుండాలి"

## కలకత్తా విశ్వవిద్యాలయంలో కే. ఎం. మున్షీగారి స్నాతకోపన్యాసం

కలకత్తా, మార్చి 20: "ఇంతకాలంవరకూ మనసమాజం ఏదో పాతబడవడిని బట్టి నడిచిపోయిన దేకాని, ఆ సాంప్రదాయాల విలువనూ, ఉద్దేశ్యాలనూ గ్రహించి, వాటికి అనుగుణమైన మార్గాన్ని నిర్ణయించుకొనటమనేది జరగలేదు. కాని మనం ప్రస్తుతం, యూరపులోవలె, సమాజంయొక్క పూర్వాపరాలను అవగాహన చేసుకుని, నిర్దిష్టమైన ఆశయాల ననుసరించి సమాజాన్ని నిర్మించటానికి పూనుకున్నాము. కాని మనం యూరపుచేసిన తప్పులను సవరించుకోవాలంటే మానవ జీవితం మీద యంత్రాలప్రభావం మితి మీరకుండా శక్తివసారం ప్రయత్నించవలసి వున్నది. జీవితపరమార్థం ఏమిటో సరిగా గుర్తెరిగి, దానికి తగినట్లుగా తమ జీవిత మార్గాలను నిర్ణయించుకునే విజ్ఞానం ప్రజలకు కలగాలి దానికి మొట్టమొదటి మార్గం, మన భారతీయ విజ్ఞాన విశిష్టతను, విలువను వారు గ్రహించేందుకు వీలుగా మన విద్యావిధానాన్ని సంస్కరించాలి." అని హైదరాబాద్‌లో ఇండియా ఏజెంటు జనరల్ కే. ఎం. మున్షీ … కలకత్తా విశ్వవిద్యాలయ స్నాతకోపన్యాసంలో ఉద్బోధించారు.

… భయాలు అన్నీ పూర్తిగా తీరిపోయి, జీవితంయొక్క సంధ్యాసమయంలో ప్రశాంతంగా రోజులు గడుపుతున్న ఒక మహాత్ముణ్ణి మరొకోటి మానవుడి ప్రారబ్ధం బలిగొన్నది; మానవజీవితం ఎంత … లో ఉన్నదీ నిరూపించడానికి ఇంతకన్న విషాదకరమైన నిదర్శనం వేరొకటి కానరాదు." సభికులు రెండు నిమిషాలసేపు లేచి నిలబడి గాంధీజీని భక్తిపూర్వకంగా సంస్మరించారు.

తూర్పుబెంగాలునుంచి, పంజాబునుంచి వేలకొలదిగా విద్యార్థులువచ్చి కలకత్తా విశ్వవిద్యాలయంలో ప్రవేశం ఇవ్వవలసిందని దరఖాస్తులు పెట్టుకున్నారనీ, తూర్పుబెంగాలు విద్యార్థులకు చోటు చూపించడమే కష్టమై పోతున్నదనీ, బెనర్జీగారు అన్నారు.

విద్యావేత్తలను, కాలేజీ ప్రధానాచార్యులను, హెడ్‌మాస్టర్లను సమావేశపరచి విద్యాబోధన ఏ భాషలో చెయ్యాలి అన్న విషయమై తానువారితో సంప్రదించాననీ, అందరూ బెంగాలీలోనే విద్యాబోధన జరగాలని అభిప్రాయపడుతున్నారనీ, ఉపాధ్యక్షుడు చెప్పారు ఇంకా కొంతకాలంవరకూ విద్యార్థులకు ఇంగ్లీషు ద్వితీయ భాషగా నేర్పబడుతుందనీ, హిందీని ప్రభుత్వం జాతీయ భాషగా నిర్ణయించేట్లయితే ప్రాచీన భాషలతో సమానంగా దానికి స్థానం ఇవ్వబడుతుందనీ, లేదా, విశ్వవిద్యాలయ తరగతులలో హిందీనికూడా అదనంగా బోధించడానికి ఏర్పాటు చేయబడవచ్చు …

### రాజగోపాలాచారిగారి హితవు

### ఉపాధ్యక్షుని ఉద్బోధ

# రాష్ట్రప్రభుత్వ పారిశ్రామిక విధానం

(1-వ పేజీ తరువాయి)

… కరమైన ప్రోత్సాహం నొసగుచున్నదనియు నడుపుచూ … గ్రాంటును మంజూరు చేయవలెనని కోరిరి.

జనాబ్ మజీద్ డిమాండుపై రూ 100 కోత తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ, ఈ డిమాండు చాలా చిన్నదిగా ఉన్నదన్నారు. ఈ ధనం ఏ పనికీ సరిపడదు, రాష్ట్రాన్ని పారిశ్రామికం చేసేదాక, ప్రజాజీవితం అభివృద్ధికాదు. ఇండస్ట్రియల్ ఫినాన్సు కార్పొరేషన్ (పారిశ్రామిక నిధిసంఘం) ను స్థాపించటానికి ధనం ప్రత్యేకించబడలేదు. దాన్ని స్థాపించటానికి అవసరమైన …

కావటానికి అవకాశం ఉన్నది. ప్రతి జిల్లాలో ఒకపరిశ్రమలబోర్డు నియమించి ఆ జిల్లా పరిశ్రమాభివృద్ధి సమస్యలను ఆలోచించుకొని పనులు జరిగే ఏర్పాట్లుచేయవలెనని కోరిరి.

శ్రీ అనంతాచార్‌గారు రాయలసీమలో ఇంతవరకు పరిశ్రమాభివృద్ధి ప్రోత్సాహమే లేకపోయినదనియూ ఆజిల్లాల అరికసిరిని గమనించి ప్రభుత్వమే చిన్న పరిశ్రమలను పెద్ద పరిశ్రమలను ఆ ప్రాంతాలలో స్థాపించు, ఆ ప్రాంతీయులు యివ్వటానికి సాధ్యమైన సహాయ్యమును ప్రభుత్వం తీసుకొని పనులు … అవసరమనిరి. ప్రభుత్వంవారివిధముగా ప్రోత్సాహమీ నేసే రాయలసీమ పరిశ్రమాభివృద్ధి జరుగదనిరి. ఖద్దరుస్కీము ఒక రెండు స్థలాల్లో జ పినంతమాత్రమున ప్రయోజనం …

వాదులని, కమ్యూనిస్టుల మనస్తత్వమూ ఎన్నదూ సోషలిస్టులకి సరిపడదని, … (మతతత్వవాదులు) … దుష్టశక్తులతోటి పోరాడగల పార్టీలు, రెండే రెండని అవి కాంగ్రెసు, సోషలిస్టు పార్టీలని, ఆచార్యనరేంద్రదేవ్ అన్నారు. కాని ప్రజాబాహుళ్యంలో వివిధవర్గాల ఆశయాలను కాంగ్రెసు ప్రాతినిధ్యం వహించలేని పంసగావున్నదని, స్వాతంత్ర్యం లభించినతరువాత, ప్రభుత్వాన్ని కాంగ్రెసు నడపడానికి బదులు, ప్రభుత్వమే కాంగ్రెసును నడుపుతున్న దని నరేంద్రదేవ్ అన్నారు.

తీర్మానాన్ని బలపరుస్తూ అచ్యుత పట్వర్ధన్ యిలా అన్నారు. …

## నీటి పారుదల సౌకర్యాలకు అంతర్జాతీయ సంఘం

## గమనిక

## సోషలిస్టు సభ నిర్ణయం

(1-వ పేజీ తరువాయి)

వచ్చింది." అని తీర్మానంలో ఉద్ఘాటించబడింది.

రాజకీయ ఆశయాలలోనూ తదితర విషయాలలో సోషలిస్టులతో పాలుపంచుకొంటూ కాంగ్రెస్ అభ్యుదయపథాన నడిచే పక్షంగా విభాజిల్లగలదని సోషలిస్టులు ఆశిస్తున్నట్లు తీర్మానంలో వెల్లడించబడింది.

### కాంగ్రెస్‌పై విమర్శ

ఏనాటికైనా సోషలిస్టు ప్రభుత్వమే, దేశానికి రాజకీయంగా ఘట్టి పునాదులు వేయగలదని ప్రజాస్వామ్యవాద సోషలిస్టు ఒక్కటేమార్గం ఉన్నది సోషలిస్టు ప్రభుత్వమనే లక్ష్యానికి అభిముఖంగా విజయవంతగా సాగిపోవడమే" అని రాజకీయ …

### రాజకీయ తీర్మానం

… స్వీయ ప్రయోజనాలను సాధించు కొనడానికి ప్రయత్నించే కమ్యూనిస్టులు దేశానికి ఘోరమైన ముప్పు తెచ్చి పెట్టేవారని, భారత రాజకీయ జీవితంలో, యిలాంటి శక్తులకు తావులేకుండా చేయడమే సోషలిస్టుల ప్రధాన కర్తవ్యమని తీర్మానంలో హెచ్చరించబడింది ప్రభుత్వంతో ఒకపై వ్యవహరించడం మానుకొని, సాంఘిక విప్లవానికి సాధనగా కాంగ్రెస్ తయారు గావాలని సూచించబడింది. మతతత్వ విరూపాలన, వర్గ విభేదాల, … విషయంలో సోషలిస్టులు కాంగ్రెస్‌తో కలిసి పని చేయాలని ఆదేశించబడింది.

### జయప్రకాశ్ నివేదిక

నాసిక్, మార్చి 20: సోషలిస్టుపార్టీ కార్యదర్శి జయప్రకాశ్ నారాయణ్ పార్టీ వార్షికసమావేశంలో నివేదిక సమర్పిస్తూ, తాను ఇటీవల ఢిల్లీలో … ఆధ్యాత్మిక పునరుత్థానానికై కర్యకర్తలు అందరూ ప్రజలలోకి వచ్చి కృషి చేయవలెనని విజ్ఞప్తి చేస్తూ ప్రకటన చేసింది, … మీద కలిగిన విరక్తి వల్లనూ, నిస్పృహవల్లనూ కాదని అన్నారు.

… కుంగా కాపాడారనీ, స్వాతంత్ర్యోద్యమంలో కాంగ్రెసును బలపరిచారనీ అన్నాడు.

"కాని సోషలిస్టుపార్టీ ఒక్క తప్పు చేసిందనిమాత్రం ఒప్పుకోక తప్పదు. కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమంలో మనం సహకరించవలసిన రీతిగా సహకరించలేదు. నిర్మాణ కార్యక్రమం విప్లవాత్మకమయినది … లో సోషలిస్టుపార్టీ ఒక అభిప్రాయం వ్యాపింపచేసింది; ఈ పొరపాటును … నా నేను అంగీకరిస్తున్నా ఎక్కువ బాధ్యత వహించవలసివస్తుంది."

# సంస్థానాల వ్యవహారాలు

## సర్దార్‌పటేల్ స్వాస్థ్యం

### వి. పి. మీనన్ సమీక్ష

బొంబాయి, మార్చి 20: వింధ్యప్రదేశ్ సంస్థాన సమాఖ్య మే 1 వ తేదీన, రాజస్థాన సమాఖ్య మార్చి 25 వ తేదీ అవతరించగలవని, కొన్ని గుజరాత్ సంస్థానాలు బొంబాయి రాష్ట్రంలో లీనమైపోతాయని, … వారంలోగా బాధ్యతాయుత ప్రభుత్వ ఏర్పాటు కాగలదని, కొల్హాపూర్ ప్రస్తుత మంత్రివర్గం బర్తరఫ్ చేయబడిందని, కేంద్ర ప్రభుత్వం పరిపాలకుడిని నియమించనున్నదని, సంస్థానశాఖా కార్యదర్శి వి. పి. మీనన్ నిన్న యిక్కడ పత్రికావిలేఖరుల సమావేశంలో వెల్లడించాడు. (ఇందుకు సంబంధించిన సమాచారాన్ని నిన్న మా పత్రికలో సంగ్రహంగా ప్రచురించాము)

### మీనన్ ప్రసంగం

"సర్దార్ పటేల్ అస్వస్థతనుండి మెల్లమెల్లగా కోలుకుంటున్నారని విని మీరు సంతోషిస్తారనుకొంటా. అస్వస్థలో ఉన్నప్పటికీ, ఆయన సర్వదా టెలిఫోన్ చెవిదగ్గర పెట్టుకొని సమాచారాన్ని యెప్పటికప్పుడు వింటూనే …

… 19 తేదీలలో వరుసగా సమాలోచనలు జరిగాయి. బొంబాయి రాష్ట్రంతో తమ సంస్థానాలను చేర్చడానికి సంస్థానాధీశులు అంగీకరించారు. బండా బారియా, కాంబే, ధారంపూర్, జవార్, లోనావధర్ రాజపిప్లా, కాంత, ఈదర్ సంస్థానాధిపతుల నిన్న ఒడంబడికపై చేవ్రాళ్లు పెట్టారు. పోగా మిగిలిన సాచిన్, రాధన్‌పూర్, … పాలన్‌పూర్ మొదలగు ఆరు సంస్థానాల అధిపతులు, ఒకటి రెండు రోజులలోగా ఒడంబడికపై చేవ్రాళ్లు చేయనున్నారు. ఈ సంస్థానాల పరిపాలనాధికా…

## బ్రిటన్‌లో భారత కార్మికసంఘం

### సోషలిస్టు విధానమునుసరించు నిర్ణయము

కవెంట్రీ, మార్చి 20: భారత జాతీయ కాంగ్రెసువారి విధానమును అనుసరింపవలెనా? లేక భారత సోషలిస్టు విధానము ననుసరింపవలెనా? అను విషయమును నిర్ణయించుటకై లండన్, బర్మింగ్‌హాం, కవెంట్రీలయందలి భారత కార్మిక సంఘముల ప్రతినిధులు దాదాపు మూడువందల మంది గతరాత్రి అవసరసభ గావించిరి. తీవ్రచర్చ జరిగినమీదట సోషలిస్టుపార్టీ విధానము ననుసరించు నిర్ణయము అత్యధిక సంఖ్యాకులచే గావించబడెను. అ. ప్రె.

… రం జూన్ 5 వ తేదీనుంచి బొంబాయి రాష్ట్ర ప్రభుత్వాధీనం చేయబడుతుంది. ఈ ఒడంబడికల ఫలితంగా బొంబాయి రాష్ట్రంలో కలిసిపోయిన సంస్థానాల విస్తీర్ణం 27 వేల చతురపు మైళ్లు. జనాభా షుమారు 26 లక్షలు. …

## ఢిల్లీ కాంగ్రెస్ నుంచి 150 రాజీనామాలు

### అరుణ అసఫాలీ కూడా

న్యూఢిల్లీ, మార్చి 21: ఢిల్లీ రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షురాలు శ్రీమతి అరుణ అసఫాలీ, రూపనారాయణ, రామశరణ చౌహన్ (వీరిద్దరూ సెక్రటరీ, అసిస్టెంటు సెక్రటరీలు), ఇంకా ఇతరులు మొత్తం 150 మంది ఢిల్లీరాష్ట్ర కాంగ్రెసుకమిటీతో తమ సంబంధాలను తెంచుకోబోతున్నట్లు ప్రకటించారు. నాసిక్‌లో సోషలిస్టుపార్టీ మహాసభ చేసిన నిర్ణయమే ఇందుకు కారణం. ఢిల్లీపట్టణ రాష్ట్ర కాంగ్రెసుకమిటీ ఎన్నికోద్యోగులు తమ రాజీనామాలను ఇదివరకే అందజేశారు.

యూ. ప్రె.

